శీతలాదేవి నుద్దేశించి చేయుటయు, దండకము మొదలగు శీతలాస్తుతి పాఠముల జదువుటయు కలదు. ఇంతియేకాక శీతలామంత్రము నుపాసనముచేసినవారు మంత్రము జపించి శీతలాయంత్రము కట్టుటయు కలదు. శీతలాధ్యానము—"నమామి శీతలాం దేవీం...స్ఫోటకార్తిప్రశమనీం మారీ జ్వరనివారిణీమ్" అని యున్నది. పైజెప్పిన విధానములచే సీశీతలారూపమైన స్ఫోటకము నివర్తించుటయు అనుభవసిద్ధముగ నున్నది. ఈవిధానమును లక్ష్యపెట్టక చికిత్సచేసినచో దానివలన వ్యతిరేకము కల్గుటయు ననుభవసిద్ధముగ నున్నది. ఏది యెట్లున్నను ఈవ్యాధియందు తన నియమిత కాలముపరకును స్వప్రభావముజూపి, తుదకు తనంతటనే శమించుస్వభావము సైజముగ నున్నది. ఈవిషయమున నేరికిని వివాదముండనేరదు. కావున విజ్ఞులు గమనింపెదరు గాక !

నిదానపరిశిష్టమ్ సమాప్తమ్.

ఇతి విశ్వనాథరచితా వ్యాఖ్యా మాధవకృతేర్నిదానస్య,
పరిశిష్టస్య చ సేయం జీయాదాచన్ద్రతారమవనితలే.

ఇతి శ్రీ శ్రీ శ్రీ కాళహస్తిసంస్థాననాథిపాస్థానవిద్వదవతంస సర్వతన్త్రస్వతన్త్ర బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రివరేణ్య చరణకమలసంసేవా సమాసాదిత పాణినీయాది శాస్త్రవిజ్ఞాన సముల్లసితుండును, సుశ్రుతచరకసంహితాష్టాఙ్గ హృదయ పరహితసంహితా ద్యాయుర్వేద తన్త్రార్థవ్యాఖ్యాతయు, శ్రీవైఖానస కులతిలక - ఆయుర్వేదమార్తాణ్డ-భిషఙ్మణి-వైద్యరత్న పణ్డిత దీవి గోపాలాచార్య సంస్థాపితాయుర్వేదాశ్రమాస్థానవిద్వాంసుండును, ఉభయభాషాకవితా విరాజితుండును, శ్రౌతప్రక్రియాధౌరేయుండును, ఆపస్తమ్బసూత్ర కౌణ్డిన్యగోత్రపవిత్ర నుదురుపాటివంశ పయఃపారావారసుధాకరుండును, వేదవేదాఙ్గశ్రౌతాభిజ్ఞ-బ్రహ్మశ్రీ అగ్నిచిత్ సీతారామవాజపేయయాజి-శ్రీమతీ సీతామ్బాసోమపీథినీ సాధ్వీమతల్లికానూభవుండును, ఉభయభాషా కవితాధురీణ-శ్రౌతాగమధౌరేయ-బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్యయాయజూకానుజుండును నగు వైయాకరణవిద్వాన్-పణ్డిత నుదురుపాటి విశ్వనాథశాస్త్రిచే విరచితంబగు "నిదానవివరణ" మను మాధవనిదానార్థవ్యాఖ్యానము, నిదానపరిశిష్టము సర్వంబును సంపూర్ణము.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1965—1000 కాపీలు.